శ్రీరామజయం.



# భరతశతకము.

ఆశీర్వచనము.

తే॥ బాలకులకు దగునవశే ।
బాలకుల విశాలబుద్ధి ప్రచురణగాదే ।
బాలకుల సంతసం బా ।
బాలక వార్ధక్యమగుట భాసిలుజగతిక ॥

మ-రా-రా-శ్రీ
రేబాల పట్టాభిరామరెడ్డి, లక్ష్మీనరసారెడ్డిగార్ల
ద్రవ్యసహాయముచే ముద్రింపించబడినది.

టంగుటూరి వరదరాజశర్మగారిచే విరచితము.



స్వతంత్ర ముద్రణాలయము, నెల్లూరు.
1932

# భరతశతకము.



అవిఘ్నమస్తు

శ్రీ వెలయఁగా వసుధన్
దేవుఁడు వివిధార్థములనుఁ దేజరిలందాఁ
గావించిన ఖండంబున
కీవెసుపుత్త్రుండవనుచు నెంచితిభరతా॥ ౧

క॥ అధారుఁడన్నిటికి గణ।
నాథుఁడు నిర్విఘ్నకరుఁడు నానావిధులన్।
బోధించుగాత బాలురుః
మేధానిధులై జగానమెలఁగఁగ భరతా॥ ౨

క॥ అలరున నలరెడు నమ్మయుఁ।
దొలియమ్మయుఁ బలుకులమ్మ తోడై యెపుడున్।
కలిమిని బలిమిని తెలివిని।
వెలయింతురు సుగుణులకును వినరాభరతా॥ ౩

క॥ అక్కఱగల వస్తువులకు।
దిక్కులుచూడడము హాని తెలియుచునీవై।
చక్కఁగఁ జేసికొనంబెం।
పెక్కను నీసుఖము దేశవిత్తము భరతా॥ ౪

క॥ ఆడకువగల ధీమంతుఁడు।
పుడమిని సర్వజ్ఞుఁడనుచు బుధనుతిగాంచున్।
గడుఁజదివినా తఁడేనిన్।
జెడుగర్వంబందెనేని సిద్ధము భరతా॥ ౫

క॥ అమ్మవలెఁగుడుపు, నయ్యగ।
నిమ్మగు జీవనము సూపు నెయ్యెడనైనన్।
గొమ్మనుమొదవై సర్వా।
ర్థమ్ములఁ జదువిలను నిత్యధనముర భరతా॥ ౬

క॥ అనవరతము పనిసేయుచు।
దనువునుగాపాడు మారుతముగతి సుజనుం।
డొనరుచు నుపకృతినెవ్వరున్।
గనులకుఁదెలియంగఁ బడరు ఘనులిల భరతా॥ ౭

క॥ అనుదినము గ్రొత్తపాఠ।
మ్మును గఱచుచు మఱవకుండ మొనసి చదువులో।
గొనవలె గురువుల మన్నన।
గనవలె సుజ్ఞానమహిమ ఘనుఁడయి భరతా॥ ౮

క॥ అనవైన పలుకుబడియును।
గనసొంపగు వర్ణనియతిగలిగి సమస్తా।
వనిలోన వన్నెకెక్కిన।
మన తెగుఁగే కుచ్యమైన మధురము భరతా॥ ౯

క॥ అక్కఱగడపఁగ దేవుని।
మ్రొక్కుటయే తెలిసిచేయు మోసముగాఁగన్।
నిక్కమగు భక్తిఁగొలచిన।
తక్కువసేయండునీకు దైవము భరతా॥ ౧౦

క॥ అప్పను మూర్ఖుని రాజును।
నిప్పును దాయ్యలిని ఫణిని నెఱనమ్మినచోఁ।
దప్పక నవియే తెచ్చును।
ముప్పును తప్పించుకొనుము ముందుగ భరతా॥ ౧౧

క॥ అసురు లసంతుష్టినిజెడి।
రెసగెడు సంతుష్టినొప్పి రింద్రాద్యమరుల్।
వసగలుగం దుషితుఁడవై।
వసుధను సంపుష్టిగొనఁగవలయును భరతా॥ ౧౨

క॥ అందము ధనములు నిలువవు।
యెందును గుణమేకరీతి నెసగునుగాన్।
పొందుము సుగుణులమైత్రిని।
తొందఱపడి విహితులనుచుఁ దొడరకు భరతా॥ ౧౩

క॥ ఆకటికి దగినకుడుపును।
నీకలిమికిదగిన యుడుపు నిను గాపాడున్।
లోకమునఁ బొంగి క్రుంగుట।
నీకనులకుఁ దేటపడదె నిత్యము భరతా॥ ౧౪

క॥ ఆయువు ధనము బలమ్ములు।
కాయమునకుఁ బొసఁగవలయుఁ గాపుసదృష్టిన్।
ఆయమున యందు నిల్పుము।
నీయెడనే నొందుకీర్తి యిమ్ముగ భరతా॥ ౧౫

క॥ ఆవంత నీతిచెడి బా।
లా! వంతపయస్సునెల్ల నాకులపఱచున్।
పావాకటితప్పి చివరకు।
గావింపదె వేలతప్పు గణనన్ భరతా॥ ౧౬

క॥ ఆసింపవలెను విద్యల।
కాసింపన్మేలు నిశ్శ్రేయశమున కిలలో।
గ్రాసము భోగములకు బే।
రాసంబడువాడు కష్టమందును భరతా॥ ౧౭

క॥ ఇనుమును గైకొని తనకళ।
జొనిపించెడు సూదిఱాయిచొప్పున వినయా।
వనతునిగని సద్గురుఁడున్।
దనవిద్యనొసంగుచుండు ధరలో భరతా॥ ౧౮

క॥ ఇమ్ముగ నజుఁడే నెడువారికి।
సొమ్ములగున్ వినయసత్యసూక్తులు బుడమిన్।
వమ్మగు బంగరుసొమ్ములు।
దుమ్ముకు సరితూఁగునంచు ద్రోయుముభరతా॥ ౧౯

క॥ ఇయ్యవలె లేనివానికి।
సెయ్యముతో వైరిపోరునిలుపఁగ వలయున్।
గయ్యమునకు గాలూనుట।
యెయ్యెడఁగారాదు సుమతి కెన్నఁగభరతా॥ ౨౦

క॥ ఇందందు దిరుగుమనమున।
కందదు పాఠంబు చపలమందక చదువన్।
పొందుగ పాఠంబబ్బును।
మందమతుల్గారు నరులుమహిలో భరతా॥ ౨౧

క॥ ఈడేరబూను పని విడ।
నాడకు మొరువేడ కెంతకైనను నిలుమీ।
జాడయె నేర్పరితనమగుఁ
గోడిగములనాడు నతఁడు కుజనుఁడు భరతా॥ ౨౨

క॥ ఈడైనదోడు నరయుచు।
గూడినఁగడు వేడ్క, హీనగుణికూడికయున్।
దోడాను పాలకై వడి।
గోడ్రాందును మారుగొనము గూడఁగభరతా॥ ౨౩

క॥ ఆకటికి దగినకుడుపును।
నీకలిమికిదగిన యుడుపు నిను గాపాడున్।
లోకమునఁబొంగి క్రుంగుట।
నీకనులకుఁ దేటపడదె నిత్యము భరతా॥ ౧౪

క॥ ఆయుఃపు ధనము బలమ్ముల్।
కాయమునకుఁ బొసఁగవలయుఁ గాపునదృష్టిన్।
ఆయమున యందు నిల్పుము।
యీయెడనే నొందుకీర్తి యిమ్ముగ భరతా॥ ౧౫

క॥ ఆవంత నీతిచెడి బా।
లా! వంతపయస్సున్నెల్ల నాకులపఱచున్।
పావాకటితప్పి చివరకు।
గావింపదె వేఁతప్పు గణనన్ భరతా॥ ౧౬

క॥ ఆసింపవలెను విద్యల।
కాసింపన్నెల్లు నిశ్శ్యయశమున కిలలో।
గాసిము భోగములకు బే।
రాసంబడువాడు కష్టమందును భరతా॥ ౧౭

క॥ ఇనుమునుగైకొని తనకళ।
జొనిపించెదు సూదిఱాయిచొప్పున వినయా।
వనతునిగని సద్గురుఁడున్।
దనవిద్యనొసంగుచుండు ధరలో భరతా॥ ౧౮

క॥ ఇమ్ముగ జదివెడు వారికి।
సొమ్ములగున్ వినయసత్యసూక్తులు బుధమిన్।
వమ్మగు బంగరుసొమ్ములు।
దుమ్మకు సరితూగునంచు ద్రోయుముభరతా॥ ౧౯

క॥ ఇయ్యవలె లేనివానికి।
కెయ్యముతో వైరిపోరునిలుపఁగ వలయున్।
గయ్యాళికి గాలూనుట।
యెయ్యెడఁగారాదు సుమతి కెన్నఁగభరతా॥ ౨౦

క॥ ఇందందు దిరుగుమనమున।
కందదుపాఠంబు చపలమందక చదువన్।
పొందుగ పాఠంబబ్బును।
మందమతుల్గారు నరులుమహిలో భరతా॥ ౨౧

క॥ ఈడేరబూను పని విడ।
నాడకు మొరువేడ కెంతకైనను నిలువుమా।
జాడమె నేర్పరితనమగుఁ
గోడిగములనాడు నతఁడు కుజనుఁడు భరతా॥ ౨౨

క॥ ఈడైనదోడు నరయుచు।
గూడినఁగడువేడ్క, హీనగుణికూడికయున్।
దోడాను పాలకై వడి।
గోడ్డాండును మారుగొనము గూడఁగభరతా॥ ౨౩

క॥ ఈతాకుగుడిసెనైనను।
బ్రీతిగఁదనయార్జనమున వెలసెడు నతఁడే।
నీతిగలవాడు కలుముల।
కాతురపడువాఁడు చింతనలయును భరతా॥ ౨౪

క॥ ఉదయమున మేలుకొనుమా।
పదపడిమదినైదుగురుల పదములగనుమా।
వదలక చదువులగొనుమా।
నిదురాహారముల పెంపునిలుపుము భరతా॥ ౨౫

క॥ ఉదరనిమిత్తము నీచుల।
చదువును సేవయును దల్లిచవతిఁ బలెనే।
యొదవించు ననర్థంబుల।
సదమలమతి ధర్మగడన సల్పుము భరతా॥ ౨౬

క॥ ఉత్తముఁడు మేలుగీళ్లకు।
జిత్తమ్మునఁ గలఁగఁడెగ్గుచే నిగ్గగనుఁ।
దుత్తునియలయ్యు రతనము।
గ్రొత్తవికాసముల మెప్పుగొనదే భరతా॥ ౨౭

క॥ ఊపిరి పై చూపులతో।
దీపించుచునుండి మేనిదిటవుసెడంగా।
ద్రోపాడిపోవుగావునఁ।
గాపాడుము తగినవిధులఁ గనుఁగొని భరతా॥ ౨౮

క॥ ఋణశేష శత్రుశేషము।
లణుమాత్రమ్మైన మిగులహాని నొసర్చుఁగ।
ఋణపడనీయు ఋణమీయమి।
గుణవంతుఁడనం బ్రసిద్ధి గూర్చుసభరతా॥ ౨౯

క॥ ఎరవు విలాసము, రాజుల।
పరిపోషణ గొన్నయశము, బంధులసాయఁ।
బౌరుదల నమ్మకములు సు।
స్థిరములుగా గొన్నయతఁడు సెడునిల భరతా। 30

క॥ ఎఱుకే పిడికిటిధన మే।
మఱుకము విశ్వంబు సరసిమను సుజనుఁడవై।
చిఱుత ప్రాయంబున నీ।
గఱచిన నీతులను మెఱుకగాంచను భరతా॥ 30

క॥ ఎక్కువ సిరికై వగచిన।
బెక్కువ దుఃఖములుగలుగుఁ బృథివినఁదనకుఁగ।
దక్కువవారలఁ జూపెఁ గడు।
మక్కువతోనుంట దొడ్డమార్గముభరతా॥ 3౨

క॥ ఎత్తునరంగున మీఱియు।
మెత్తనచే గాంచనంబు మేలిమియయ్యెఁగ।
విత్తము విద్యయు గల్గియు।
మెత్తనిగొనమున్నగాని మెచ్చరుభరతా॥ 33

క॥ ఎప్పుడు తప్పు కనంబడు।
నప్పుడు సరిదిద్దుకొనుట యసదృశగుణమౌ।
ముప్పునగలిగెడు దుఃఖము।
లిప్పుడగాంచెదరు సూరు లెంతేయు భరతా॥ ౩౪

క॥ [illegible]ను లవశ్యమో నీ।
వాపనులను జేసి కీర్తినందుము లాభ।
ప్రాపకమని నీచావళి।
దాపునకుఁ జనగనీకు తగదుర భరతా॥ ౩౫

క॥ ఏమఱక తెలివిఁ బెంపుము।
నీమంబు నడంపబోకు నెనరిగురో త్తఁ।
ప్రేమింపుము భూమాతఁ।
శ్రీమించు యశంబు సుఖముచేకురు భరతా॥ ౩౬

క॥ ఏవచ్చుఁ నాటికంటె।
లేవడినాఁడీవిమేలు లెక్కింపఁగ స।
ద్భావంబుతోడ దీనుల।
జీవులవీక్షించువాఁడు సిద్ధుడు భరతా॥ ౩౭

క॥ ఒకతరుణంబొక పనిగొని।
ప్రకటితముగ దీర్ఘవలయు భ్రష్టంబదియే।
గకవికలు గలుగఁ బడివను।
లోకతతిబూనంగఁ జేటులాదవును భరతా॥ ౩౮

క॥ ఒరులం దసయట్టుఁగని।
సరసంబులువలికి సుజనసంఘము తోడన్।
జరియించెనేని యుత్తమ।
చరితుండని మెత్తురతని సరసులు భరతా॥ ౩౯

క॥ ఓడకు మీకష్టమునకు।
వాడకుమీ పరులసొమ్ము వంచనమలి వో।
నాడకుమీ దుర్వ్యయమున।
వీడకుమీ ధర్మమెట్టి వేళనుభరతా॥ ౪౦

క॥ ఒడలున కొంటినవానిని।
గుడువుము మితకాలమునకు కొలదిని రుచులన్।
బడిచెడకు తిండిపోతుగ।
పుడమిని లఘువుగనఁదిను బ్రిబుద్ధుఁడు భరతా॥ ౪౧

క॥ ఒక్కొకపని నొక్కతెఱి।
జక్కగ నెఱవేర్పవలయు జదివెడు పట్లన్।
జక్కకు మాటల నిదురన్।
సొక్కకుమీ పగలుకునుక జూడకు భరతా॥ ౪౨

క॥ ఓరుపు నిజముంగనుఁగొను।
నేరపు గౌరవము సుఖమునెలకొన ధరలో।
గూరుపుబనులును దన్నెఱి।
వేరుపు దాలిమినిఁ దార్పు విసరా భరతా॥ ౪౩

క॥ ఔషధము జాడ్యమునకుఁ।
బోషణము శరీరమునకు బుద్ధికి గడుసం।
తోషమె భూషణమగుసం।
శోషణమెన్నంగ జదువు శోభరభరతా॥ ౪౪

క॥ కదురుంగవ్వములాడెడు।
సదనంబున గరవులేని సంపదలొదవుఁ।
చదువును సుగుణములుండిన।
* గొదుకని మోదావహంబు గూడును భరతా॥ ౪౫

క॥ కనిపెంచుమాత ననువున।
మనఁజూపెడు పితను, నడతమలపుచు విద్యఁ।
మనుజునిజేసెడు గురువును।
దనుపుదుమే ఋణముదీర్చి ధరలోభరతా॥ ౪౬

క॥ కడపకమూరక పొద్దును।
పడయగరా దొక్క క్షణము బాసినయేనిఁ।
గడుకొని యరయుచునుండుము।
బుడమిని సర్వజ్ఞుఁడనగ బొసగదుభరతా॥ ౪౭

క॥ కపటము, గర్వము, లోభం,
బపకారము, దొంగతనము, నాగ్రహపాటుఁ।
విపరీతభోజనము లివి।
యెప్పుడైన సమానుషంబు లెన్నఁగభరతా॥ ౪౮

క॥ కలహంసము, లావులునై।
చిలుకలు, ఫలవంతమైన చేనులుగానై।
జలిగంపలు, లొడియలునై।
వెలయుదురిల శిష్యులిన్ని విధముల భరతా॥ ౪౯

క॥ కలిమికిలోభము శత్రువు।
చెలిమికి వైరంబు కపటశీలము యొందుఁ।
తెలివికి గర్వముశత్రువు।
చెలువమునకువైరి కుటిలచింతయె భరతా॥ ౫౦

క॥ కలహముగలిగెడు చోటికి।
కులహీనులు వెలయుసభకు గోతులకడకుఁ।
పిలువని పేరంటమునకు।
తెలివిగలుగువార లరుగుదేరరు భరతా॥ ౫౧

క॥ కవియగునాతని వ్రాతయు।
నవరసములుగులుకు కృతియు నానాజనసం।
స్తవనీయమైన పాలన।
భువిలోనఁ వడయు పరమపూజ్యత భరతా॥ ౫౨

క॥ కసుమాల మతేములోదిగి।
పసచెడి సత్సంగసుఖము బాయుటయేలా।
పసగల ఫలముల మెసవక।
కసుగాయల కొసరువాఁడు ఘనుఁడే భరతా॥ ౫3

క॥ ఔషధము జాడ్యమునకుఁ।
బోషణము శరీరమునకు బుద్ధికి గుణసం।
తోషమె భూషణమగుసం।
శోషణమెన్నంగ జదువు శోభరభరతా॥ ౪౪

క॥ కదురుంగవ్వములాడెడు।
సదనంబున గరవులేని సంపదలొాదవుఁ।
చదువును సుగుణములుండిన।
గొాదుకని మోదావహంబు గూడును భరతా॥ ౪౫

క॥ కనిపెంచుమాత ననువుగ।
మనఁజూపెడు పితను, నడతమలుపుచు విద్యఁ।
మనుజునిజేసెడు గురువును।
దనుపుదుమే ఋణముదీర్చి ధరలో భరతా॥ ౪౬

క॥ కడపకమూరక పొద్దును।
పడయగరా దొక్కక్షణము బాసినయేనిఁ।
గడుకొని యరయుచునుండుము।
బుడమిని సర్వజ్ఞుఁడనగ బొాసగదుభరతా॥ ౪౭

క॥ కపటము, గర్వము, లోభం,
బపకారము, దొంగతనము, నాగ్రహపాటుఁ।
విపరీతభోజనము లివి।
యెప్పుడైన నమానుషంబు లెన్నఁగభరతా॥ ౪౮

క॥ కలహంసము, లావులునై।
చిలుకలు, ఫలవంతమైన చేనులుగానై।
జలిగంపలు, లొడియలునై।
వెలయుదురిల శిష్యులిన్ని విధముల భరతా॥ ౪౯

క॥ కలిమికిలోభము శత్రువు।
చెలిమికి వైరంబు కపటశీలము మొందుఁ।
తెలివికి గర్వముశత్రువు।
చెలువమునకువైరి కుటిలచింతయె భరతా॥ ౫౦

క॥ కలహముగలిగెడు చోటికి।
కులహీనులు వెలయుసభకు గోతులకడకుఁ।
పిలువని పేరంటమునకు।
తెలివిగలుగువార లరుగు దేరరు భరతా॥ ౫౧

క॥ కవియగునాతని వ్రాతయు।
నవరసములుగులుకు కృతియు నానాజనసం।
స్తవనీయమైన పాలన।
భువిలోనఁ వడయు పరమపూజ్యత భరతా॥ ౫౨

క॥ కసుమాల మతములోదిగి।
పసచెడి సత్సంగసుఖము బాయుటయేలా।
పసగల ఫలముల మెసవక।
కసుగాయల కొసరువాఁడు ఘనుఁడే భరతా॥ ౫౩

క॥ కన్నమ్మ కడుపుఁ జూచును।
వెన్నుం దిలకించు గొన్న వెలదుక గుణసం।
పన్నత తల్లిం గొలుచుచు।
నన్నుతులం గాంచు నతఁడె నరసుఁడు భరతా॥ ౧౪

క॥ స్తూరి మృగముకై వడి।
దు స్తరుఁడగు నీతిశాలి దుష్టులు మూర్ఖుల్।
వి స్తరిలుచుండరే శ్వా।
నస్తోమములట్లు జగమునందున భరతా॥ ౧౫

క॥ కాడులు వీడులగుటయుఁ।
వీడులునుంగాడులఁగుట విపరీతంబే।
ఱేకులుమాఱగ భువిలో।
నాడులుమాఱొందుచుంట నైజముభరతా ౧౬

క॥ కారాని వస్తువునకుఁ।
గోరికపడవలనదెంత కోమలమైనఁ।
పోరాని చోటికేగకు।
మారకనే దొఱకులిబ్బి యున్నను భరతా॥. ౧౭

క॥ కుడువఁగ, ముడువఁగఁ దొడువఁగ।
గడియింపఁగ నేర్పి, పుత్త్రిఁగని యుబ్బవలెఁ।
కొడుకున కబ్బరముగదా।
గుడిపినఁ గడులోటు, జేటుఁగూడదె భరతా॥ ౧౮

క॥ గతిలేనివానివలె నీ।
వితరుల జతఁగూడి వేడనేలా మన భా।
రతభూమిఁబుట్టి సతతముఁ।
హితముల గృషిచేసి పొందుమిష్టము భరతా॥ ౫౯

క॥ గెలుపుగొనుమింటఁ దొలుతఁ।
వెలుపలగెలుపందవచ్చు వివిధార్థములుఁ।
కులవిద్యనేర్చి పడయుము।
కలిమియు శీలంబుబలము ఘనమోభరతా॥ ౬౦

క॥ గౌరవము సంతలోఁగొను।
క్రూరులడంబములు మేలుఁగూర్పంగలవా।
గౌరవమున కిరవై ఘణి।
యేరీతిగ మేలుఁగూర్చు నిలలో భరతా॥ ౬౧

క॥ గ్రాసములకు వేసంబులు।
మోసమునకు లేనిపోనిముచ్చటలెల్లఁ।
గాసులకే పాట్లెల్లను।
వాసలకే మాటగట్టుటగురా భరతా॥ ౬౨

క॥ ఘనదర్శనమున నెమలికిఁ।
బెనుపోరాటమున నిలుచుఁబిల్లికిఁ గరువుల్।
ఘనుఁ డనువున సుఫలముగొనుఁ।
జెనటియు వెతనొందియోగుఁ జేఁగొనుభరతా॥ ౬౩

క॥ చదువరియూడక మతిచెడుఁ।
జదువక యే యాటకాయ జడమతియగురా।
ఎదబలము నొడలిబలముల।
నొదవించును చదువు నాట లొప్పగ భరతా॥ ౬౪

క॥ చేతిపనిచేసి బ్రతికెడు।
నాతఁడె సుచరిత్రుఁ డితరు నాశించుటయే।
రోతయగుఁగాన గడుఁబ్ర।
ఖ్యాతిగజీవింపఁ బనులగఱపుము భరతా॥ ౬౫

క॥ జంకకుమీ సభలోపలఁ।
బొంకముగా మాటలాడి పొందుముకీర్తిన్।
బొంకకుమీ యెప్పట్టున।
సంకటముల దగులుకొనకు సతతము భరతా॥ ౬౬

క॥ టక్కరి యర్థములందడు।
నక్కయు సరసాన్నభోజనము గనదిలలో।
ముక్కోపి తనవిసెందఁడు।
కుక్కయుఁ గడుపారుగుడుపుఁ గొనునే భరతా॥ ౬౭

క॥ డాయకుము తాగుఁబోతును॥
డాయకుమాజూదగాని డంబాచారిన్।
డాయకులోభిని గోపిని।
డాయకు సోమరిని కడుదృఢవ్రత భరతా॥ ౬౮

క॥ తడవాగకు మాపదలోఁ।
బడువానికెఱింగి తగిన వైద్యాదులచే।
నోడఁగూర్పుము సౌఖ్యంబును।
పడయుదు విహపరసుఖముల వదలక భరతా।  ౧౯

క॥ తప్పులఁబట్టుటకన్నను।
యొప్పుఁగని యొరుని మెచ్చు టుచితవిధంబౌ।
తప్పైన దనయెడఁగన్గొని।
గొప్పతనంబందువాఁడు గుణియగు భరతా॥  ౨౦

క॥ తనయూరి గౌరవంబును।
తననాలుకయందు విద్య తనయోచనయున్।
దనకష్టార్జిత ధనమును।
ఘనముగ మనఁజేయు సాధకములిల భరతా॥  ౨౧

క॥ తినవలెఁ దనువుకుఁదగినవి।
మనవలెఁ గాలోచితముగ మంచితనమ్మున్।
గొనవలెఁ దనసీమనుదా।
జనవలె సందర్భమెఱిఁగి సరసుఁడు భరతా॥  ౨౨

క॥ తెలివికి గల్పనకార్యము।
కలిమికి యుపకృతియె తగిన కార్యంబిలలో।
బలిమికి సాయము కార్యము।
చెలిమికిఁగార్యంబు ప్రేమ చెలువుగ భరతా॥  ౨౩

క॥ తెలివియు, విద్యయు, నక్కఱ।
బలమును, త్యాగంబు, నోర్పు, పాటును, వెలయన్।
వెలకొన దైవబలంబును।
గలసిన కార్యంబు జయముగానగు భరతా॥ ౨౫

క॥ తాలి చద్దియగ్నిదీప్తికి।
మలిబోసం బొడలి బెంపు మానక చేయున్।
జలకనయగు మాపటిగుడు।
పలరించును తేజమును సరయుము భరతా॥ ౨౬

క॥ దండనము లేక పెఱిగిన।
పండితసుతుండైన విద్యవడయడు తెలుకన్।
దండకమును ఖండించియు।
బెండిస నేగాడె రసము బిచ్చిలు భరతా॥ ౨౭

క॥ దైవం బొక్కరు డఖిలము।
గావింపను బెంపద్రుంపం గారణమతండై।
భావమునం గానపించును।
ధీనరులకు నెల్లవేళ దెలియంగ భరతా॥ ౨౮

క॥ ధీరుండా పత్సంపద।
లోరిమితో సైచి సుఖమునొందుచు నుండున్।
గూరిరములకు నోపందుప।
కారములకుదలనోసంగ గడగును భరతా॥ ౨౯

క॥ నడురేయినైన దీనుని।
గొడవను దీర్పంగఁగలు గుణవంతుఁడు లో।
బడ డెగుటి మేలుకొలఁకఁగ।
గడుదయదన నైజగుణము గావుర భరతా॥ ౨౯

క॥ నానాటవృద్ధిఁబొందెడు।
జ్ఞాన మహింసావ్రతంబు సత్యాశ్రయముఁ।
మానని సౌజన్యంబును।
నానాలుగు మానవములనందగు భరతా॥ ౩౦

క॥ నిందింపకు మెవ్వానిని।
నిందఁబడి కుందఁబోకు నిందితుతోడఁ।
బొందొనరింపకు, నీయెడ।
సందియములు గలుగరాదు, జగమున భరతా। ౩౧

క॥ నునువుల భోగములనఁజెడ।
గడు బెంపకు కొలదియైన గణనకు వచ్చుఁ।
గడుకొని విద్యాయశముల।
వడిఁబెంచెడువాఁడె మానవఁతుఁడు భరతా॥ ౩౨

క॥ నేరుపుతో మాటాడుము।
కూరిమితో నిరుగుపొరుగుఁగూడి మెలగుమా।
గారాబునఁ జరియించుము।
నూరులజాడలను గుణముశోభిల భరతా॥ ౩3

క॥ పలుదోమి మోముగడుగుము।
తెలవారఁగఁ దూర్పురేఖవిర్చిన వెంటన్।
వెలిబూది నొసటదాల్పుము।
తెలివిని సమకూర్చుఁబనుల దిరుగుము భరతా॥ ౭౪

క॥ ఫలముంగోరుచు జేసిన।
చెలిమియు ద్యాగంబు దేవసేవయు దిన్నమై।
నిలువవు గావున నేప్రతి।
ఫలమాసి పనము ధర్మపద్ధతి భరతా॥ ౭౫

క॥ పొగడత కుబ్బఁడు దానై।
బొగడుకొనం డాడడెగ్గు బోనమువొడుగన్।
తగినటుఁగొను పెనుకలిమికి।
వగనొందఁడు నీతిపరుఁడు వసుధను భరతా॥ ౭౬

క॥ పొందునకుం బోరునకుం।
దొందరపడబోకు సుఖముదుఃఖమ్ముల మున్।
ముందుగనుంగొని ఫలితము।
లందుము సరసుండవగుదువవనిని భరతా॥ ౭౭

క॥ పొంకమ్మున కిమ్మనఁదగు।
సంకమ్ముల నచ్చరముల సలపఁజూపఁదగున్।
గొంకిరి మార్కెవ్వార్లన్।
వంకరమాటయు గలదె వసుధను భరతా॥ ౭౮

క॥ పోఁగొట్టి మంకుతనమును
రాఁగట్టుము తెలివిచేత రంజిలువానిన్
లోఁగుట్టును గనిపెట్టుటఁ
నీ గట్టితనంబునకును నెటి యగు భరతా॥ ౫౯

క॥ ప్రాల్మాలికచే బాలుఁడుఁ
దాల్మియు దాక్షిణ్యమునను, దానమ పాత్రన్
గుల్మములు కలుపుచేతను
గల్మియు సంశయముచేత గతిఁజెడు భరతా॥ ౬౦

క॥ ప్రతిదినము నోడలఁగడుగన్
బ్రతివారము తలనుఁగడుగ బ్రాల్మాలకుమా
యుతికినబట్టలఁ గట్టుము
సతతము శుచి మేలుగూర్చు సాధన భరతా॥ ౬౧

క॥ బలమున్ జలముం బౌరుష
ములు దలకొనుఁ బిన్ననాడె మొనయుచుఁ బనులన్
జెలఁగి విజయంబునొందుచుఁ
గలకాలము కీర్తితోడఁ గడుపుము భరతా॥ ౬౨

క॥ భూతలము నేలవచ్చును
ఖ్యాతిని బడయంగవచ్చుఁ గడుసులభముగా
లోతుం గనవచ్చు నబ్ధిన్
ఆతురునిం దృప్తిబఱచు టలవియె భరతా॥ ౬౩

క॥ [illegible]మూత్రాదులవేగము
[illegible] బచేఁ దెప్పులుగలుగు నియమములేకన్
[illegible]చ్చువానికిలలో
దెలిపియు గాంచియును బలముద్రెళ్ళదె భరతా॥ ౯౪

క॥ మానవములనఁగ జఱగెదు
వాసినిఁగై కొనుచు గానివానినిఁ గొనకన్
మానితపు నడతఁపూనిన
జ్ఞానముదీపించు ఘనగుణంబిది భరతా॥ ౯౫

క॥ మురిపమునకు నబ్బురపడి
పరవాసిని గొంపజేర్చు బ్రతుకొక బ్రతుకే
పరుడేలుచు మనల నినా
గరికులుగాఁ జేయుటట్లుగాదే భరతా॥ ౯౬

క॥ మృగములకు నాసికములన్
ఖగములకున్ గండ్ల బన్నగములకుఁ జెవులన్
జగముననరులకు మనమున
నగణితముగ బలము నిచ్చెనాద్యుడు భరతా॥ ౯౭

క॥ రామాయణ భారతముల
నీమంబున చదువుకొని మనీషులవద్దన్
ధీమంతుఁడవై లోక
క్షేమాస్పదమైన త్రోవఁ జెలఁగుము భరతా॥ ౯౮

క॥ రుచియని యమితముగా దిని
ప్రచురణకుఁ వచ్చుబాధ పడమేలగునా
యుచితాహారముగొనుచోఁ
బచనంబయి జఠరదీప్తి ప్రబలును భరతా॥ ౯౯

క॥ లంచములు దినెడువానికి
సంచులు వేయైనగానిఁ జాలమివరుల్
వంచించియొ దోచించియొ
వెంచుకొనుం జింతనెపుడు పృధివిని భరతా॥ ౧౦౦

క॥ లెక్కింపకు ధనలోభులఁ
బొక్కింపకు భూతతతుల బుధులన్ గురులన్
జిక్కింపకు నీమర్మము
స్రుక్కింపకు మార్యభూమి శోభను భరతా॥ ౧౦౧

క॥ విందొనరింపని వియ్యము
పొందికలేనట్టిపల్కు పురిహారుగుడిలో
వందనములేని పూజయు
నెందునఁగొఱఁగానివరయ నిలలో భరతా॥ ౧౦౨

క॥ వెన్నియ్యకుమా పగఱకు
మన్నింపకు కొండెగాని మానరహితునిన్
బన్నకుము కలహమెన్నడు
బన్నమువడి చింతిలకుము వసుధను భరతా॥ ౧౦౩

క॥ వ్యాపారమునకు లెక్కయుఁ
గాపుతనంబునకుఁ గోల కరణమునకుఁ గే
లాపనికలమును రాజుల
భూపరిపాలనకు నీతిపోడిమి భరతా॥ ౧౦౪

క॥ శూరుఁడగు క్రీడిపుత్త్రుని
పౌరుషుఁడగు ధ్రువుని చిన్నిప్రహ్లాదు సదా
చారుని మార్కండేయుని
చారిత్రంబులను జూచిచదువుము భరతా॥ ౧౦౫

క॥ హిమశైల పఙ్క్తి మొనలుగ
నమరుచు జలనిధులఁ దాకు నాదిమభూభా
గము, మనకు మాతృదేశము
క్రమముగ నీవేలి పేరుగంటివి భరతా॥ ౧౦౬

క॥ క్షితి నాంధ్రభారతీయుల
సుతులీసూక్తుల బఠించి సుమతులగుదు రీ
కృతి యాచంద్రార్కంబై
యతుల జయాస్పదములొసఁగునన్నిట భరతా॥ ౧౦౭

క॥ విశ్వము నుతింప భువిపై
నైశ్వర్యయుతుండు భరతుఁడంచెడు శతకం
బీశ్వరుని కరుణచేతన్
శాశ్వతముగ వరదరాజశర్మ రచించెన్ ౧౦౮

సంపూర్ణము.

# తప్పొప్పులు

| పద్యము. | పాదము. | తప్పు. | ఒప్పు. |
|---|---|---|---|
| ౨ | ౧ | ఆధారు | ఆధారు |
| ౩ | ౩ | కలమి | కలిమి |
| ౫ | ౧ | ఆడకు | ఆడకు |
| ౬ | ౪ | సుజాన | సుజ్ఞాన |
| ౭ | ౪ | తెగుచే | తెనుగే |
| ౧౨ | ౪ | సంపుష్టి | సంతుష్టి |
| ౧౪ | ౧ | ఆకటి | ఆకటి |
| ౧౮ | ౨ | పయస్సు | వయస్సు |
| ౨౩ | ౧ | దోడు | తోడు |
| ౨౮ | ౨ | చవతి | సవతి |
| ౩౨ | ౨ | పృధివిన | పృధివిని |
| ౩౯ | ౧ | వచ్చుఁనాటి కంటెఁ | వచ్చునా టికంటెఁ |
| ౪౨ | ౧ | ఒక్క | కొక్క |
| ౪౪ | ౪ | జదువు | జదువు |
| ౫౦ | ౨ | లముయెం | లగబెం |
| ౫౧ | ౩ | పిలువ | బిలువ |
| ౬౮ | ౩ | పెను | పరు |
| ౬౭ | ౨ | తెనివి | తెలివి |
| ౭౨ | ౧ | జలము | జవము |
| ౭౮ | ౨ | వాసిని | మనుజు |
| ,, | ౩ | దేలుఁచు | బురమున |
| ౭౬ | ౨ | చమపు | చమువు |
| ౧౦౦ | ౪ | వెంచు | పెంచు |